ఓం శ్రీ సద్గురవే నమః

# జ్ఞానబోధాధ్యాత్మలు

బీబీపేట కాపురస్తులగు బ్రహ్మశ్రీ వే॥ గౌతమగోత్రోద్భవ కాచాపుర విశ్వనాథాచార్య ప్రియశిష్యుడగు బీబీపేట నివాసియగు ఆనంతకుల గోత్రజుడగు

కీ॥శే॥ **రెడ్డిశెట్టి హనుమద్దాసు** లచే

రచింపబడియె.

ఈ గ్రంథము హక్కుదారులు


**శిద్ధేశ్వర పబ్లికేషన్స్**

బుక్ సెల్లర్స్ అండ్ పబ్లిషర్స్

సిద్ధంబర్ బజార్, హైదరాబాద్

కాపీరైట్ రిజిష్టర్లు) 1995 (వెల రూ॥ 5-00

నైజాం రిజిష్టర్ నెం.6 నిషాన్ నెం. 74 కాపీరైట్




## హెచ్చరిక

కీ॥శే॥రెడ్డిశెట్టి హనుమద్దాసుగారిచే రచింపబడిన ఈ"జ్ఞానబోధాధ్యాత్మలు"అను పుస్తకమును యిదివరలో కొండా శంకరయ్య గారి వద్ద నుండి జె.యస్॥గుప్త అండ్ సన్స్ గారు సర్వాధికారములు పొందియుండెను. జె.యస్. గుప్త అండ్ సన్స్ వారి నుండి 14-6-1977 తేదీన మేము సర్వ హక్కులను పొందియున్నాము.

-----------------------------------

# జ్ఞానబోధాధ్యాత్మలు

ఉ॥ శ్రీ గణనాథునిన్ - శీఘ్రముగా భజియించి వేడ్కతో
బాగుగ జ్ఞానబోధయను-పద్యములన్ రచియింతు నంచు నీ,
లాగున సర్వ విద్యలకు - లక్షణవంతుని నాది దేవునిన్
జాలిగ నేలి బ్రోవుముని - సన్నుతిజేసి జీవమా ! ॥

## జంఝూటి రాగం - చాపుతాళం

శ్రీ గజాననా- పురారి తనయ మమ్ము బ్రోవుమో గజాననా। యోగివినుత మాకు సకల భోగముల నొసంగుమనుచు - సాగిలబడి మ్రొక్కుచుంటి - జాగుసేయ వలదుతండ్రి ॥శ్రీ॥ నిన్నె నమ్మితి పరాకదేల నన్ను బ్రోవ సన్నుతించితీ - పన్నగేంద్ర వలయవేష పాకశాసనాది మినుత - కన్నతండ్రి వనుచునేను కరములొగ్గుచున్నవాడ ॥శ్రీ॥ తొలుత మీకును - జోహరొసంగి విద్య లకును దొరవటంచును - పలు విధముల సకల జనులు ప్రస్తుతింతురంచు నాదు తలపులోన మీ పదముల - దలచి వేడినాను తండ్రి ॥శ్రీ॥ బిల్వదళముల విరజాజి వకుళ చంపక చెంగల్వ కుసుమములు - సలలితముగ దెచ్చిమిమ్ము సన్నుతించి యనుదినంబు - చెలువు మీర పూజ - సేతునాదు వాంఛదీర ॥శ్రీ॥ ధరణి యందును - విశాలమైన బీబీపేట పురమునందున - స్థిరముగాను నిలచి భక్తవరులకెల్ల వరములొసగి - కరుణతోడ హనుమద్దాసు దురితములను బాపినావు ॥శ్రీ॥

చం॥ కమలజురాణి చారుతర - కంజదళాక్షి పటీరగాత్రి యా
గమనుత కంబుకంఠి గజ - గామిని మంజులవాణి వాణియు
త్తమ గుణశాలి భక్తవర - దాయకి యందు నమస్కరించి నీ
విమలపు వాక్కులన్ మదిని - వేమరు ప్రస్తుతిజేయు జీవమా ! ॥

## దర్బారు రాగం - ఆదితాళం

కరుణించవే జగదాంబా - నీకు శరణు సేసెద శారదాంబ - కరుణించు నీ పాదకమల

ము నెప్పుడు మరువకను స్మరియింతు మదిలోననూ తల్లి॥కరు॥ సరసమౌ విద్యయందు । కోరి సన్నుతించి నిన్నే ముందు । సుర సిద్ధగరుడ కిన్నర యక్షులును గొల్వ । పరమేష్టికిని ముందు భార్యవైతివి తల్లి ॥కరు॥ శరదిందునిభ దివ్యగాత్రి - మాకభయము నివ్వవె కమల నేత్రి - సరెసరెయని పుణ్య నదులెల్ల మెచ్చగను కరమొప్ప కవిధార - కలుగ జేయుము తల్లి ॥కరు॥ పల్లవపాణి మా తల్లి నిన్నె ప్రస్తుతించెద కల్పవల్లి - తొల్లి జన్మపు ఘోర దోషములేమున్న పొల్లుపొల్లుగ జేసి పొలతీరొ రక్షించు ॥కరు॥ ధర బీబీపేటలో నిలిచి హనుమద్దాసుని రక్షింప దలచి । దురిత జాలములెల్ల తొలగించి సద్గతి కరుణతో నొసగిన పరమపావనివమ్మ ॥కరు॥

ఉ॥ గురు పాదపద్మముల - చిత్తములోపల సారెసా రెకున్
బాగుగ పూర్ణభావమున - ప్రస్తుతి జేయుచునుండి కిల్బిషో
ద్యోగచయంబలెల్ల కడ - ద్రోయుట క్షేమకరంబు నీకు యీ
భోగము శాశ్వతంబె యిక - బొందుము సద్గతి వేగ జీవమా ! ॥

## నాదనామక్రియ రాగం - ఆట

శ్రీ గురుపదముల మదిలో నెప్పుడు చింతనసేయుమురోరన్న - యేగతిచూచిన యింత కు మిక్కిలి యేది దీనిసరి రాదన్న ॥శ్రీ॥ గురుడే బ్రహ్మము గురుడే విష్ణువు - గురుడే రుద్రుడు వోరన్న - గురుడే సర్వము గురుడే నిత్యము గురుడే నీకు తోడన్న ॥శ్రీ॥ ఆది బ్రహ్మమని అమ-రేంద్రాదులు-అభినుతిజేతురు వోరన్నా-నాదబిందుకళ జాడతెలిసి సమ్మోదము నొందుము వోరన్నా ॥శ్రీ॥ క్రోధగుణంబులు వదలి సద్గురు బోధతెలియుము వోరన్నా-సాధుసజ్జనుల సహవాసంబును సలుపుట మంచిది వోరన్నా ॥శ్రీ॥ వెనుకటి మన గుర్తెరుగని పనులు- మనకు మోసమే కదన్నా । యశము బొందవలె మానవజన్మము నెత్తినప్పుడే వోరన్నా ॥శ్రీ॥ పశువు రీ తిగను దిరిగిననేమి ఫలములేదుర వోరన్నా । నిత్యముగాదీ మాయశరీరము నిలుదు నిలుదు రోరన్నా ॥శ్రీ॥ నెత్తురు మాంసపు తిత్తేగాని పుత్తడి యెన్నడు గాదన్నా ॥శ్రీ॥ మాటికి బీబీపేట వాసుని నోట స్మరింపుము వోరన్నా । పాటిగ హనుమద్దాసుడు చెప్పిన - పలుకులు నిజము వోరన్నా ॥శ్రీ॥

చం॥ గురుడె పితామహుండు సిరి - కోమలి వల్లభు డచునాతుండు శ్రీ
గురుడె యుమాధవుండు మది - కోరిన కోరికలెల్ల నిచ్చు శ్రీ
గురుడతి భారనుండు శతకోటి దివాకర సన్నిభుండు శ్రీ
గురుని పదారవిందముల కోరి - భజించి తరించు జీవమా ! ॥

## శంకరాభరణ - జుల్వ తాళం

పదవే శ్రీగురుపాద పద్మ సన్నిధికి - మదమత్సరము లింకమాన వెన్నటికి ॥పద॥ ఆయుష్యమెన్నాండ్లో గానలేవు -మాయ సంసారంబు మరిగియున్నావు ॥పద॥ ఇట్టి మానవజన్మ మిక చాలు విను ముట్టు రక్తములోన మునిగితె సుఖమా ॥పద॥ శివపంచాక్షరి నీకు సిద్ధించు వినుమా - భవపాశములను నివారించు కొనుమా ॥పద॥ వాసిగ తడవింక జేసెదవేల -లేశ మాత్రము భక్తి లేకుంటే మేలా ॥పద॥ సుందర బీబీపేట మందిరుడైనా - ఇందుమౌళి చింత విడకెన్నడైనా ॥పద॥ హనుమద్దాసుని మాట లాలించి విను -వినకుంటే సద్గతి గన నీకు తరమా ॥పద॥

చ॥ పరులను వేడబోకు శివ । భక్తుల గనుగొని దూరబోకు పా
మరులను జేరబోకు సిరిమంతులతో కలహించబోకు భూ
వరులను నమ్మబోకు గుణవంతుల సంగతి మానబోకు శ్రీ
గురుని పదారవిందముల - కోరి తరించు జీవమా ! ॥

## శహన రాగం - అట

వినవే వో మనసా సద్గురుజాడ గనవే వో మనసా - వినవే వో మనసా యీ విధమెల్ల చెవిబూని ఘనులైన వారికి కర్ణామృతములివి ॥వి॥ అతిభక్తి బూని సారెకు నీ దుష్కృతమెల్ల మాని సతతాము గురుభక్తి సలిపియుండితివేని పతితపావనుడు నీ పాలిటనుండును ॥వి॥ శరణన్న వారి యాపదలెల్ల బలిమార్చి మీరి -మరువజాలక నాత్మమగ్నుడై యొకసారి - స్మరియించు వారికి కరతలామలకము ॥వి॥ సుజ్ఞాన సహితుడు అజ్ఞానుల కగుపడడతడు - విజ్ఞానమును లెస్స వివరించు నీ దుష్ట ప్రజలెల్లను వెళ్ళబార ద్రోలుము నేడు ॥వి॥ దోసర పనులు - సలిపితె మెచ్చ జాలరు బుధులు । భాసురబీబీపేట వాసుడైన హనుమద్దాసుని బ్రోచిన- ఈశుని స్మరియించు ॥వినవే॥

ఉ॥ పామరమెల్ల మానియును - భక్తుల సంగతి సేయబూని దు
ష్కా.మ గుణంబులందు నతి - కాంక్షలు బెట్టుట బోలిమాని యా
భూమిసురోత్త మోత్తముల - పొందుగ దీవన గొంటినేని యా
కామహతుండు మోదమున - గ్రక్కున సద్గతినిచ్చు జీవమా ! ॥

## నాదనామక్రియ రాగం - అట

జీవుడ వినరా నామాట - విముక్తి భావము దెలిపెద పరగనిచ్చోట॥జీ॥ పంచేంద్రియములబంధించు -మంచి పనులందు నీ బుద్ధి పరచు నూహించు ॥జీ॥ అక్షరంబుల మరుగు -వాటి

సాముగన గురుని సన్నిధి కరుగు -నేరుపుతోను గురుతు ఏనుగు - పెక్కు దారిద్ర్యమును దాసి తలతిక్క తిరుగు ॥జీ॥ నిత్యముగాదు యీతనువు -రాలు మృత్యువునికై ఇంత మూరిపె మొందెను - కుత్సిత పనులెల్ల మరువు -నీవత్యాస గోరుట అదిచాలు బరువు ॥జీ॥ అజ్ఞానమున గూల బోకు - మంచి సుజ్ఞానివైవుంటే మరిమేలు నీకు ॥జీ॥ బీబీపేట నివాసుడైన హరుని యేప్రొద్దు దలచితే ఇక ఘోరమైన తాపత్రయాదులేమైన నీ దాపుజేరవుసుమ్మి దగ లేశమైన ॥జీ॥ తాముజేయు పుణ్యపాపంబు - తాననుభవించక తీరదని నిశ్చయంబు -హనుమద్దాసుని విన్న పంబు - నీవు వినవేమి చెవిబూని విని సమ్మతంబు ॥జీ॥

ఉ॥ కానల నీగలున్ మధుపు - గ్రక్కున గూర్చియు మానవాళికిన్
పూనికనిచ్చునట్లు నతి - బుద్ధి విహీనతచేత లుబ్ధుడున్
దాసము ధర్మము న్మదిని దల్చక ద్రవ్యము గూర్చి సౌఖ్యమున్
గానగలేడుగా తుదకు - గాంచు నధోగతి త్రోవ జీవమా ! ॥

## కాంభోజి రాగం - చాపు తాళం

ఎన్నాళ్ళు బ్రతికిన ఏమి సామ్రాజ్యంబు -ఎందుకీ మోహంబు జీవా - పన్నుగా నిహలోక భ్రాంతి వదలియు శివునిభజన సేయవే మాయ జీవా ॥ఎ॥ తొలిజన్మమున జేయు దోషకర్మము యిందు దొలగజాలక మళ్ళి జీవా -ఎలమీతో నీజన్మ మెత్త కారణమాయె యెరుగజాలవు మాయ జీవా ॥ఎ॥ మొదట నవమాసములు మురికి గర్భములోన మునిగి తేలుచునుండి జీవా -మదిలోన కడతేరె మార్గమెట్లని చాల మరుగుచుంటివి మాయ జీవా ॥ఎ॥జనన మొందెటిదాక జనని గర్భములోన జగదీశ్వరుని నీవు జీవా - ఘనముగా నుతియించి గర్భసంకటము నుండి కడతేరితివి మాయజీవా ॥ఎ॥ యవ్వనంబున మదము క్రొవ్వి మోహముచేత ఎదురు తెన్నెరుగ కను జీవా - పువ్వుబోణులగూడి భోగించితిని చాల బుద్ధి తప్పియు మాయ జీనా ॥ఎ॥ వృద్ధత్వమున బలము ఉడుగుచుండియు వ్యాధులుద్భవించుచునుండె జీవా-బద్ధత్వమున నింక బ్రతుకు నిక్కంబనుచు భ్రమజెందకుము మాయ జీవా ॥ఎ॥ జనని గర్భమునుండి జన్మించి మాయలో జేరుకొని కొన్నాళ్ళు జీవా-ఘనమైన ఆపదల ననుభవించుచు దినము గడుపుచుంటివి మాయ జీవా ॥ఎ॥ మాయసంసారంబు మంటి బొంతులటంచు మరి నీకు దెలియదా జీవా - కాయంబ నిత్యంబు కలగన్న చందంబు కల్లగాదిక మాయ జీవా ॥ఎ॥ ఆలు పిల్లలు తమ్ములున్నరంచు ఆశ నొందగబోకు జీవా-కాలుడచ్చట నిన్ను కష్టపెట్టగనెవరు కడతేర్చరిక మాయాజీవా ॥ఎ॥ ఇండ్లు మేడలు సొమ్ములితర భోగంబులు యివి నిత్యమనుకోకు జీవా -కండ్లజూచుక నీవు కామాంధ

కారమున గర్వమొందకు మాయజీవా ॥ఎ॥ దసలిపోగలు గూర్చి దనర గృహమును బన్ని దారి గనగలేక జీవా -విసిరికాయల పురుగు మెసలజాలక తుదకు నశియించదే మాయా జీవా ॥ఎ॥ కూటికోసంబయ్యి కొరగానిపనులెల్ల కోరుచుండగబోకు జీవా-నీటిలో మీనంబు ఎర్రమాంసం కయ్యి నిక్కినీల్గదె మాయజీవా ॥ఎ॥ పలుమారు నావంటి బలవంతుడెవడని భయపెట్టకొరు లను జీవా-బలవంతమైనట్టి పాపము చీమలచేత ప్రాణంబు విడువదేజీవా ॥ఎ॥ ఏమి దానము లేక వేల లక్షల ద్రవ్య మెంత గూర్చిన మాయ జీవా - పాము కుబుసము విడిచి పారిపోయిన విధము పరుగెత్తుదువు మాయజీవా ॥ఎ॥ ధరలోను బీబీపేట పురవాసుడై నట్టి పురహరుని దలచవే జీవా-దరిలేని సంసార శరధి నిమిషములోన దాటించునిక మాయ జీవా ॥ఎ॥ చేటుకే మూలంబు జయమునొందవు మాయనాటకంబిది సుమ్మి జీవా - బూటకంబనుచు నిచ్చోట హనుమద్దాసు మాటనమ్మవే మాయ జీవా॥ ఎన్నాళ్ళు బ్రతికిన ॥

చ॥ కల గనుగొన్న మాడ్కికుల కాంత సుతాదుల వర్గమెల్ల నీ
విలను సమస్త భోగముల - నీప్సితమొందుట మేరగాదు
కేవలముగ ముక్తిమార్గమిక వారిజముల్ స్మరియించి నంతటన్
గలుగును ముక్తి మార్గమిక - గ్రక్కున సంశయమేల జీవమా! ॥

## మధ్యమావతి రాగం - ఆట

వినరు తెల్పెద జీవా విశదంపు మాట -కనర ముందర దేవుకడతేరు బాట ॥వి॥ గురుడు తెలిపిన మాట మరచియుండకుమా -మరయుండక దాని మహిమెల్ల గనుమా ॥వి॥ శరణన్న వారిని వెరపింపవలదు కరుణించి ముందర ముక్తిగలదూ॥వి॥ పరకాంతలను జూచి భ్రమజెంద బోకూ విపరీతమైన కోపము పాలుగాకు ॥వి॥ తల్లిదండ్రుల యాజ్ఞ తగ మీరరాదు తలిదండ్రి కన్న దైవము వేరేలేదు ॥వి॥ ఘనమైన నరసూలుగల బీబీపేట హనుమద్దాసుని మాటలను విన్న చేటా ॥వి॥

ఉ॥ కాయము నిత్యమంచు నతి గారడివిద్యలు బన్నుకొంచు న
న్యాయపు వర్తన ల్మదికి న్యాయమటంచు దలంచు జీవనో
పాయము జెందుచున్ తుదకపాయము బొందుట మేరగాదు నీ
మాయతనంబు లన్ని నిక మానుట క్షేమకరంబు జీవమా! ॥

## ఆనంద భైరవి రాగం - జుల్వ

శివశివా యనియేటి మంత్రము చిత్తమున పఠియించు చుండియు సవినయంబుగ గురునిపదముల సన్నుతించిననాడు భగవద్భక్తుడూ । జీవ స్ముక్తుడూ ॥శివ॥ దుర్జనులతో గూడి నిత్యము దుష్టబుద్ధినిబాయకుండియు సజ్జనులకెల్లపుడు కీడు సలుపగోరుచున్నవాడు దురాత్ముడూ । అతి కపటాత్ముడూ ॥శివ॥ సకల ప్రాణులెల్ల తనవలె సమముగను భావించి పరమశివుడొకడే దైవంబనుచు తనమది వికలమొందక మెలగువాడె శిష్టుడూ । భువిలో శ్రేష్టుడూ ॥శివ॥ కాముకుండై ఎపుడు నిహసుఖమే మహత్తరమనుచు నెంచియు నేమములు విడనాడి విషయ స్తోమమున జెందినవాడే క్రూరుడూ । భువిన పచారుడు ॥శివ॥ పొల్లుగింజలవంటి యీ యిల భోగముల నమ్మంగ బోకవి । కల్లలని గుర్తెరిగి శివుని యుల్లమున నమ్మినవాడే పుణ్యుడూ । ఇలలో ధన్యుడు ॥శివ॥ గవ్వగవ్వయు గూర్చి దానం బివ్వకను దాగుండ తలపులు, లివ్వకను దిల్వంగ కిలకిల నవ్వుండేవాడు భువిలో మత్తుడూ । దుష్టచిత్తుడూ ॥శివ॥ పరసతుల యందాశ జెందియు వరుసవావియు లేకతిరిగే నరపశువులను దొరకబట్టి యముడు గూలగ వెయ్యడా । దండన జేయడా ॥శివ॥ హలగాను శోధించి సద్గురు కీలముగుర్తెరిగెననియు మేలుమేలని యెపుడు లోలుడు । సద్గతి నివ్వడా ॥శివ॥ పెద్దపిన్నల తారతమ్యము సుద్ధి తెలివియు మూఢచిత్తుల వద్ద జంకియున్న నభపుడు బుద్ధిమంతుడనుచు దగ్గరదియ్యడా । మన్నన చెయ్యడా ॥శివ॥ భాసురంబగు బీబీపేట నివాసుడై సిరులిచ్చి హనుమద్దాసు నేలినట్టి శ్రీగిరీశుని నమ్మితే । జనులకు మిత్రుడూ ॥శివ॥

ఉ॥ ఇట్టి ఘటంబు నీకు పరమేశ్వరు డిచ్చిననేమి కద్దు నీ
పుట్టుక నాటినుండియు । పుణ్యమెరుంగక పాపకర్మముల్
గట్టుచు క్రూరచిత్తమున కాలము బుచ్చితి వింతమట్టుకున్
గట్టుకు మోయు రాళ్ళగతి । గాని మరేమియులేదు జీవమా! ॥

## మధ్యమావతి రాగం - ఆట

ఏమి బ్రతుకు జీవా సద్గతి కెదురు చూడు త్రోవా । ఏమి బ్రతుకు సుఖమేమి శరీరము తామసగుణముల దారికేగువిది ॥ఏమి॥ తొమ్మిది తొఱ్ఱలతోలుబొమ్మ యిది నమ్మబోకు మోసమ్ము దెచ్చుసుమ్మీ ॥ఏమి॥ మట్టికుండ యిటువంటి తనువు కటువంటి భ్రాంతి యెటువంటిదో తెలియదు ॥ఏమి॥ ఆయువు యౌవన ప్రాయమెన్నటికి ఖాయమంచునిక కలలో తలుపకు ॥ఏమి॥ అష్టయిశ్వర్యముల మరియుండినను కష్టము తప్పదు ఘటము పోవువరకేమి సిరులు హరులు మణి కనకాంబరములు స్థిరమని యెంచియు మురియ బోకుమిది ॥ఏమి॥ భాసుర

బీబీ పేటలో హనుమద్దాసుని బ్రోచిన ఈశుని తలుపని ॥ఏమి॥

చ॥ నయముగ నొక్కసారి శివ నామము నోట పఠించినంతనే

భవభయ రోగ మృత్యుతత్తి బాధలు నెల్ల నశించుమాట ని

శ్చయమని వేద శాస్త్రములు చాటుచునుండె నిరంతరంబు

సంశయమును మాని శంకరుని । సన్నుతి చేసి తరించు జీవమా! ॥

ఫీల్ రాగం - ఆటతాళం

హర హర శివ శివ యనగ ఓ జీవా । హరియించు పాపములని తెలియలేవా ॥హ॥ ఇంత యుత్తమ జన్మ మిక నీకు రాదు । ఎంతజెప్పిన జ్ఞానమింతైన లేదు ॥హ॥ ప్రతివారి దుష్కృతి పనులెన్నబోకు । అతి ఘోరమైన దుర్గతి పాలుగాకు ॥హ॥ అధికుండనని చాల అహం కార పడకు । బుధుల సంగతి గోరి విధమెల్ల విడకూ ॥హ॥ దారా పుత్రులు చాలా తనకెందరు న్నా । వారు వెంబడి దర్లిరారు మేరన్నా ॥హ॥ గురుని సన్నిధికేగి శరణొందవేలా । దరిజేర్చుమ ని చాల మొరలిడవేలా ॥హ॥ భాసుర బీబీపేటవాసుని మదిలో । ధ్యాస నిలిపితే కీర్తిభాసిల్లు నిలలో । వాసికెక్కిన హనుమద్దాసుని మాట । మోసమొందగ బోదు ముక్తికిబాట॥హర॥

చం॥ కలిమియె శాశ్వతంబనుచు । గర్వముజెందకు యెల్లకాలమున్

నిలువదు భోగమెన్నటికి నిత్యము కాదిక వెంచిచూడ వె

న్నెల బనుచుండురీతి మది । నేరక మాయలజిక్కి దుర్మతిన్

తలచక కీర్తిచే నిపుడు । ధన్యతజెందుట మేలు జీవమా ! ॥

## శ్రీరాగం - ఆటతాళం

శివ శివ యనవే మనసా । దుశ్చింతన యెందుకె గడుసా । చెవి నాటగ నే చెప్పిన హిత వులు చెవిగొనవిక నీ రసము దెలిసెను ॥శివ॥ పాంచభౌతిక బొమ్మ నుత్పన్నత జేసెను బ్రహ్మ । పంచలోహముల ప్రతిమ గాదు యిది మంచుబిందువలె కించిద్భోగము ॥శివ॥ అష్టమూర్తి పద సేవా ఉత్కృష్ట పదవికే త్రోవా । నిష్టబుద్ధి మది నిలిపితివా నీ కష్టము లెల్లను కడతేరును యిక ॥శివ॥ బంధువులున్నారనుచూ భ్రమ జెందుచు కలవర పడకూ । అంధునివలె నీ వదిలిపడకు మది యిందుధరుడు మన యిష్ట దైవమిక ॥శివ॥ దారసుతులపై మోహం విస్తారముండుటది ద్రోహం । ఘోరమైన సంసార బంధమిది తీరదెన్నటికి గోరక దందయు ॥శివ॥ శివ భక్తుల పోకడ బాచి । మది శరణుజేయుమిక లేచి । ప్రవిమలమతి ధృడ భక్తియు నిలిపితే భవసాగర

మును భస్మంబగునట ॥శివ॥ హద్దామద్దాసుని మాట మది నాలకించక చేటా । విను ముదము న నీకు బీబీపేటలో నిలచియు ఘనముగ భక్తుల కరుణించెను యిక ॥శివ॥

చం॥ పరమ రహస్యమైన నొక । పద్ధతిదెల్పెద నీకు నిప్పుడున్
మురియుచు కాశీ కాంచీపురి ముఖ్యములైన మహాస్థలంబులున్
బరువడి ఎండ వాన చలి బాధలనంత ప్రయాస బొందుచున్
తిరుగగ నేమి కారణము దేవుడు నీలో గలండు జీవమా ! ॥

## రేగుప్తి రాగం - ఆట

భజేయించనే శివుని మనసా । యెంత పాపకారివే నీవు గడుసా । భజియించుమని యింత బ్రతిమిలాడినగాని నిజమాని నా మాట నిలుపవేమి సేతు ॥భజి॥ యిట్టి జన్మము. మళ్ళిరాదు । నీకు యింతైన జ్ఞానంబు లేదు । వట్టివిద్యలు యెన్ని వచ్చినప్పటికైన పొట్టకొరకే గానీ పోవు సద్గతి జేర ॥భజి॥ చక్కని పొలతూల వల । లోన జిక్కి తిరిగెదవేమయా । నక్క రేలగాయలు నమిలి ఖ్రింగుటెగాని । గ్రక్కున ముందటి గతిగాన లేదాయే ॥భజి॥ దీపమున్నంత లో నీవు । మంచితెలివి బొందుట గానలేవు । ప్రాపుగ గురుసేవ కోరుటకైయింక రేపాయే నను టెల్ల రిత్త మాటలు గాన ॥భజి॥ ఎదురైన వారిని జూచి । వెక్కిరించెదవు నిందజేసి । నుదుట వ్రాసిన వ్రాత నూరేండ్లకైనను । వదలజాలునె యెంతవారికైననుగాని ॥భజి॥ భాసుర బీబీపేట యందు । నిలిచి భక్తుల నేలెను ముందు । వాసవాదిముని పందితుడై హనుమద్దాసుని కృపతో ను దరిజేర్చునిక నిన్ను ॥భజి॥

చం॥ మునుపటి జన్మమందు గురు । మూర్తి కటాక్షము బొందజాలకన్
యెనుబది నాల్గు లక్షలును - యేర్పడి జన్మములెత్తి మళ్ళీ యీ
మనుజ ఘటంబు దాల్చితిని । మాయలో జిక్కి చెడంగనేల యా
సనకసనందనార్చితుని । సన్నుతిచేసి తరించు జీవమా ! ॥

### శ్రీరాగం - ఆటతాళం

వివర నా మాట వో జీవా - నాదు విధమెల్ల ముక్తికి త్రోవ ॥విన॥ పనిబూని శ్రీగురు పాదములను నీదు । మనమున నిలిపి చింతనసేయుటే మేలు ॥విన॥ కులవిద్యనే మనంబు విడువకు । కలిమిగలవారి గని చింతపడకు । కలిమిలేములు రెండు కావడి కుండలు । విలు వైన మాయలోపల గూలబోకుము ॥విన॥ సాధుసజ్జనులను జేరి । వారి సహవాసమును జేయ గోరి । బాధించె సంచిత బంధముల ద్రెంచి । మోదముతో నీతిబోధ తెలుసుకొమ్మి ॥విన॥ పరు

ల దూషించుట మాను । భక్తవరులను గని మ్రొక్కబూను । శరణన్న వారికి కొరతేమి లేదని నిరతము బుధులెల్ల మొరపెట్టుచున్నారు ॥విన॥ తల్వాకు నితరుల పొందు । మనసు నిలుపుము గిరిజేశునందు । కల్పవృక్షమువలె గరళకంఠుడుండ । అల్ప మానవులను ఆశ్రయించుట యేల ॥విన॥ ధనధాన్యముల నమ్మబోకు । వెర్రితనము వెంబడి రాదు నీకు । తనయులాప్తులు చాల దాయాదులెవరున్న । సాయము చేయగ తర్లి వెంబడి రారు ॥విన॥ సుందర బీబీపేట యందు । నిలచి సుజనులను గాంచెను ముందు । అందముగను నిత్య హనుమద్దాసుకు ముది యందున నిలచెటి ఇందుమౌళిని నమ్ము ॥వినర॥

ఉ॥ మానవ జన్మమెత్తి గురు । మంత్రము నోట పలించకున్న నా
మానవ జన్మమేల నధ । మాధముడై తుదజేరు దుర్గతిన్
మానవ జన్మమెత్తి గురు । మంతము నోట పలించుచున్న నా
మానవ జాతికిన్ సుగతి । మార్గముగల్గు నిజంబు జీవమా ! ॥

## నాదనామక్రియ రాగం - ఆట

శివశివయని భజియించెటి వారికి చిత్తము నిలపై నెక్కడిది । అవివేకంబున దిరిగెడివారికి ఆత్మవిచారం బెక్కడిది ॥శివ॥ పెద్దల తెలియని పెకుసు మానవుడు యెద్దుగాక బుద్దెక్కడిది । గద్దరి చేతలు మానని మోటుకు గంగాస్నానం బెక్కడిది ॥శివ॥ దాన ధర్మములు చేయని లోభికి దయగుణ కనికర మెక్కడిది । మానహీనుడగు దుర్మార్గునికి మంచినడవడి కెక్కడిది ॥శివ॥ పరపురుషుంగని భ్రమయు లేమకు । పతివ్రతామణి మహిమెక్కడిది । యిరుగుపొరుగు కడకేగే వానికి ఇంటిమీద జోలెక్కడిది ॥శివ॥ పెండను మెదిలే కీటకంబునకు బెల్లము రుచి యింకెక్కడిది । తిండిపోతునకు కుండమీద కుతి దేవునిపై మన సెక్కడిది ॥శివ॥ పరగరోత దినె ఊరబందికి పరమాన్నము కాంక్షెక్కడిది । భాసుర బీబీపేట నివాసుని । భజియించితే భయమెక్కడిది । వాసిగ గురుయుపదేశము నొందిన వారికి నరకంబెక్కడిది । మరువక మదిలో నమ్మిన వారికి మరల జన్మమింకెక్కడిది ॥శివ॥

ఉ॥ ఇప్పుడె జ్ఞానమార్గము వహించి మహేశుని పాదపద్మముల్
తప్పకవేడుటె పరమ ధర్మము నమ్ముమి నీదు ప్రాణముల్
చెప్పక పోవువేళ నుతిజేసి తరించెదనన్న కల్లయౌ
దప్పికయుగాగ కూపమును దవ్వుచునున్న విధంబు జీవమా ! ॥

## రేగుప్తి రాగం - చాపు

నిలువదు నిలువదు కాయం । యిది నిమిషములోన మాయం । నిలువదు నిలువదు నీటిబుగ్గ యిది కలలో భోగము । కనబడు చందము ॥నిలు॥ అప్పుడిప్పుడనబోకు । మృతి యెప్పుడో తెలియదు నీకు । తప్పదు మృత్యువు తనువు కెన్నటికి కప్పను సర్పము మ్రింగినరీతి ॥నిలు॥ చాలుచాలు దుర్బుద్ధి । వినవదేమి నా బుద్ధి । మేలని సద్గురు కీలుదెలయకను కాలము వ్యర్థము గడుపుచున్న విక ॥నిలు॥ శాంతగుణము మది దలచి । వేదాంత విచారమె దెలిసి । కంతుహరుని పదకమలములను నీ మంచితనమున యేమారక దలుపుము ॥నిలు॥ సుఖదుఖ ములు రెండు । మదినొకటని దలచుచునుండు । సుఖమేనిజమని చూడబోకు నమ్మకముగాదు నీవిక భ్రమజెందక ॥నిలు॥ సుందర బీబీపేట । బాలేందుధరుని నీ నోట । అందముగను నీవభి నుతించి జయ మొంది సద్గతి జెందుట క్షేమము ॥నిలు॥ పనికిరాని పనులకును । పరుగులెత్త బోకికను । హనుమద్దాసుడు ఆడినమాటలు । వినజాలవుయేమని తెలుపుదు నిక ॥నిలు॥

చ॥ అమిత ధరాతలంబు కనకాద్రి । సమాన ధనంబు గూర్చియున్
సమహిత గోప్రదానములు । సామజగానము అశ్వమేధముల్ ।
క్రమముగ నెన్ని జేసినను । కామితదాయుని కీర్తనాళికిన్
సమమిక కావు నమ్ము । సత్యము నీ మదిలోను జీవమా ! ॥

## నాధనామ క్రియరాగం - ఆది

శివ శివయనరేమి నరులు । యెంత యవివేకులయ్య యీ యజ్ఞాని పామరులు ॥శివ॥ సుజనులందరి జేరకనరు । మదగజము రీతి కండ్లగానకుందురు । నిజమైన మార్గమెరుగరు హరుని భజన కీర్తనలంటే భ్రమసెంది వినరు ॥శివ॥ ధ్యానమెప్పుడు సేయలేరు । లేనిపోని మా టలు నోటబూని పల్కెదరు । జ్ఞానవంతుల దూరెదారు । బుద్ధిహీనులై సద్గతి కానాగలేరు ॥శివ॥ వాసనాత్రయముల విడరు । భగవద్దాసులగని చాల దండంబులనరు । కాసైన దానంబు లివ్వ రు । మృత్యు వాసన్నమైవచ్చెనని చింతపడరు ॥శివ॥ స్థిరమైన బీబీపేట యందు భక్తవరులను పోషించి వసియించె ముందు । పరమ పావనుడాని విందూ । మూలమెరిగి ప్రస్తుతిజేయ రేమ నందూ ॥శివ॥ దోషగుణములెల్ల మాని । హనుమద్దాను మాటలు తలపున బూని । వాసి మీరగ నమ్మరేని యెంత మోసమొందగలేరు ముక్తి యేనాడు ॥శివ॥

ఉ॥ ఒక్క క్షణంబునైన ముద । మొప్పగ శంభుని పాదపద్మముల్
చక్కగ ప్రస్తుతించి । యతి సంతస మొందుట కోర్వలేవు ని
న్నక్కడ ధర్మరాజభటు లద్భుతమైన ప్రయాస పెట్టగన్

గ్రక్కున నెట్టు లోర్చెదవు । గావున బుద్ధిని మాను జీవమా ! ॥

## రేగుప్తి రాగం - ఆట

ఎంత చెప్పినగాని యింతైన మనవాలకించ వేమందును జీవా । నీవు కంతుసంహారుని కలనైన మదిలోన చింతసేయవు మాయజీవా ॥ఎం॥ తొలిజన్మమున నేదో తోచినంతలో దానముల సేయకనుంటి జీవా । మళ్ళీ గలుగనేరదు యెంత ఘనుడైతేనేమి తమ్మలపాకు తొడి మైన జీవా ॥ఎం॥ తిన్నగ భువిలోన దివ్యతిరపతులెన్ని తిరగితేమున్నది జీవా । నీవు పన్నుగ నాకలి గొన్నవారికి పట్టెడన్న మిడితే చాలు జీవా ॥ఎం॥ సాధుసజ్జనులాను సవరించబూనితే సంసారమును జేయు జీవా । కుక్షిబాధ కోసంబైతే పడరాని యిడుమల బోకుమిక మాయ జీవా ॥ఎం॥ ధరలోని బీబీపేట పురవాసుడగు హనుమద్దాసుని హితవులు జీవా । నీవు మరువకు మదిలో దుస్తరమైన సద్గతి కలుగును యిక మాయ జీవా ॥ఎం॥

చ॥ నిమిషము వొక్క తాపునను । నిల్వదు యీ మనసేమి పాపమో
కమలభవుండు దీని మది । కల్పన సేయుట కేమి మూలమో
క్రమమును దప్పి యక్రమము । గను తరించుట కేమి న్యాయమో
భ్రమగొని దీనితో చెలిమి । బట్టుట మోసతరంబు జీవమా ! ॥

## రేగుప్తి రాగం - ఆట

ఎన్ని దిక్కుల దిరుగు మనసూ । దీని కెవ్వరిచ్చిరోకాని అలుసూ । యెన్ని దిక్కులదిరుగు యేమందు నిక దీని । యున్న చోటుండక నురుకులాడుచునుండు ॥ఎ॥ ఎంత బోధించిన వినదూ । బుధుల చెంతజేరుట దారి గనదూ । మంతనమున శివునిచింత మానకుమంటె యింతైన మనవాలకింపదేమి సేతు ॥ఎ॥ బెరికి సేతలు మానబోదు । దీని తరువాయి యిక చెప్పరాదు । కొరగాని పనులెల్ల కోరకుమనియంటె । కోరుకోరానివి  కోరుచునుండును ॥ఎ॥ కయ్యమునకు లావు గడుసు । స్త్రీల యొయార్యము జూచి వలచూ । చెయ్యరాని పనులు చేయకుమనియంటె చేయ చేయానని చేయుచుండును ॥ఎ॥ కోతిరీతిగ దిరుగుచుండు । దున్నపోతు సేతల మానకుండు । నీతి మార్గమునకు ప్రీతితో జనుమంటే । పోత పోతానని  పోవకనుండును ॥ఎ॥ పోదు సద్గురు సేవ సేయా । బుద్ధిరాదు దీని కాలనేయ । పొందుగ పాదములె నాకు ఆధీనమని తెల్యదాయె నేమనందు ॥ఎ॥ బీబీపేట పురవాసుడైన । హరుని నేపు మీరగ నెన్నడైన । ప్రాపుగోరుట కింత నోపవలదు ఎంత । పాపమొ రవ్వంత సేపైన నిలువదు ॥ఎ॥ తనుపు యస్థిరమని

యెంచి । మంచివనక దుర్గుణములు ద్రుంచి । హనుమద్దాసుని మాటలాలించియును చాల విను వినుమంటేను విననను చుండు ॥ఎ॥

ఉ॥ ఎక్కడి దుర్గుణంబు । యిది యేమి విచిత్రము చెప్పరాదికన్
మ్రొక్కరు పెద్దలన్ గనియు । మోదముతోడుత మోమువంచియున్
చక్కని స్త్రీలజూచి యతి । సంతసమంది వరించుచుందురీ
కుక్క గుణంబు మానవుల । గూడుట మోసకరంబు జీవమా ! ॥

## రేగుప్తిరాగం - ఆట

ఇదియేమి మహిమ దుర్జనమెక్కడిది వచ్చె తరమ । యిది యేమిమహిమోకా నిన్నాండ్ల వలెగాదు చదలుపురుగులరీతి ।జనులంతదేలిర ॥ఇది॥కులయాండ్ల విడిచి సారెకు నీచపాలతుల వలచి పలువిధములు మద్యపానాదులను సల్పి కలగూరవలెనంత కులమొక్కటిగజేసి ॥ఇది॥ రండముండలకు ఖండితమాడే మొండివారలకు దండులకు డబ్బు ధారబోతురుగాని పండితు తడిగితే పైసైన నివ్వరు । తడబడ గొనుచు భిక్షకులడుగ చిడుముడి పడుచు । పిడికెడన్నము చేత భిక్షమిడరు గాని కడుపు పెద్దదిగ బెంచి ఘనముగ భుజింతురు ॥ఇది॥ తలపున వేగ సద్గురు పాదములు జేర్చిబాగ । సలలితముగ వారు సన్నుతించరుగాని పలుగాకే మాటలు బడ బడ వదరుదురు ॥ఇది॥ భాసురముగను బీబీపేట వాసుని కృపను ఆశించి పలుమారు అభిను తించెడి హనుమద్దాసుని మాటల గతినమ్మ లేరైరి ॥ఇది॥

పాపపుజాతి మానవుల । సజ్జను జేరి మహాపరాధముల్
తేపకు సల్పుచుండి గురు । దేవునియందలి భక్తి మార్గమున్
లోపము జేసి మాయకును । లోబడి నీవు చరించు టెట్లనన్
దీపము బట్టి కూపమున । దిగ్గున దూకు విధంబు జీవమా ! ॥

## ముఖారి రాగం - ఆట

జనులారా ఇటువంటి జన్మము యికరాదు । చెప్పితె వినజాలరు నామాటలు చెవిబూని చవిగొనరూ । మనమున శివనామా మంత్రమే రుచియని పనిబూని యొకసారి బలుకరైరి నోట । సారములేని సంసారములో జిక్కి సారము గననేరరూ సారెకు । సద్విచార మొందజా లరు దారపుత్రుల వాంఛ దగిలి మీరలు మంచి । దారిగానక చాలతత్తరపడి యేరు ॥జను॥ ఎ న్నెన్ని జన్మములెత్తి । యెత్తి ముందు యెక్కడెక్కడ నుంటిరో । సారెకు బాధలేమేమి పడుచుంటి రో పస్సున ఈ ప్రాణములెన్నడు బోవునో । నిన్ను జూచినవార లున్నార ఈ వేళ ॥జను॥ పరో

పకారము పనులనెల్లపుడు భావము సల్పుడీ ముందర నీకు పరమపదము నమ్ముడి । సిరి సంపర్కములు స్థిరమై యుండబోవు । కరి దిన్న వెలగపండెరుగ జాలరు మీరు ॥జను॥ మచ్చిక తోడుత మహిలో పెద్దలు చాల మదిలోన యోచించియు । సత్కార్యము నిచ్చతోడ దలంచి యు వచ్చి యుండితే వారికి పరమేశు । డిచ్చినంతలో దానమివ్వ దలచుకొనుడి ॥జను॥ భాసు ర బీబీపేట వాసుడైన పార్వతీశుని చరణంబులు నమ్మితే ద్రుంచివేయు దుష్కర్మంబులు దోషగు ణములెల్ల దొలగిపోవును । హనుమద్దాసుని మాటలు తలపున నమ్ముడి ॥జను॥

ఉ॥ ఎన్నడు పోవునో తనువు । యెందుకు నీ వతిభ్రాంతి జెందనీ
కెన్ని విధంబులన్ దెలుప । వెర్రితనమ్మును మానవింక నా
పన్న శరణ్యు నిన్ పతిత । పావను గొల్చిన మోక్షమబ్బు నా
విన్నపమాలకించు మిక । వీనుల పండువుగాగ జీవమా ! ॥

## సౌరాష్ట్రరాగం - ఆట

ఎప్పుడో యేవేళనో జీవెళ్ళిపోతుంది । చెప్పకను రెప్పపాటున చెదిరిపోతుంటీ ॥ఎ॥ ఏ చెట్టునందో గట్టునందో చేటుకాలములయందో । గట్టిగా నీ బొంది వదలి పిట్టలెగసినట్టువలెనే ॥ఎ॥ బాల్యమందో ప్రాయమందో బులుపుతీరిన ముదిమియందో । గాలిసోకి పండుటాకు రాలిపోయిన చందమున ॥ఎ॥ పగటియందో సంధ్యయందో పరగ మధ్యరాత్రియందో । గగన మందున మెరుపుతీగెయు కదలిపోయిన చందమున ॥ఎ॥ బంధుజాలము తోడ బుట్టిన భ్రాతృ లనుజులు భార్య తనయులు । యెందరుండినగాని వారల నెగరజిమ్మి మోసపుచ్చి ॥ఎ॥ వాసికె క్కిన రెడ్డిశెట్టి వంశ సంభవుడైన హనుమ । ద్దాసునేలిన బీబీపేట ఈశుని స్మరియించుకొనుడి ॥ఎప్పుడో॥

ఉ॥ చక్కెరకన్న చూతఫల । సారముకన్న గుడంబుకన్న పెం
పెక్కిన తేనెకన్న నతి । ప్రేమజనించు ఘృతంబుకన్న మున్
మక్కువ తోడుతన్ దివిజమండలి । గోలిన దానికన్న నిం
కెక్కువయైన తియ్యదన, మీశుని నామమెరుంగు । జీవమా ! ॥

## ఘరాజు రాగం - ఆట

సాంబశివుని నామమెప్పుడు స్మరణ సేయరదెందుకు । సంబరంబున పాపకర్ములజాడ గోరేటందుకు ॥సాంబ॥ మందమతులయి భక్త జనముల నిందజేతురు యెందుకూ । కందిరీగల బంధికాన యందు గూలేటందుకూ । కరకురంపము కోతఘూతలకష్ట మందేటందుకు ॥సాంబ॥

మదముచే పరసతుల మోహము వదలజాలరు యెందుకూ । తుదకు కాలుని విచ్చుకత్తుల పొదిని కూలేటందుకు ॥సాంబ॥ కావరంబున పెద్ద పిన్నల గానకుండుదు రెందుకూ । భావమందున భక్తి నిలువక పరులదూరేటందుకూ ॥సాంబ॥ దోషమనకను తల్లిదండ్రుల దూలనాడుదు రెందుకూ । రోషమానసులు కుంభీపాకమున పతనమొందేటందుకూ ॥సాంబ॥ చెంగలింపుచు చాడిమాటలు చెప్పుచుందురెందుకు । పొంగుతైలము చురుకుబాధలు పొందుచుండేందుకూ ॥ సాంబ॥ మంచితనమని దొంగ పనులకు మరుగుచుండుదు రెందుకూ । కంచులోహము అగ్ని జ్వాలలు ఘాత బొందేటందుకూ ॥సాంబ॥ ధరలో హనుమద్దాసు మాటలు మరచి యుండుదు రెందుకూ । పరగబీబీపేటవాసుని పదవి బాసేటందుకూ ॥సాంబ॥

ఉ॥ కమ్మని పాలుమీగడలు । గారెలు బూరెలు పాయసాన్నముల్
కొమ్మకు గూర్చు తేనెయును । కొబ్బెరబెల్లము పంచదారయున్
తమ్మలపాకు వీడెమును । తాలిమి సేయక సారెసారెకున్
తెమ్మని నోరుబాపుదువు । తెల్యదు సద్గతినేర్ప జీవమా ! ॥

## నాధనామక్రియరాగం - చాపుతాళం

మానసమందున శివుని భజించిన మనుజుడె యుత్తముడెన్నటికి । తానెక్కువ యని మురిసిన మూర్ఖుడు దరిముట్టగ లేడెన్నటికి ॥మాన॥ ధూర్తత్వంబును వదలనిమూఢుడు కీర్తి బొందలే డెన్నటికి । వ్యర్థపు మనుజుడు భక్తితో భగవత్ కీర్తన సేయడు యెన్నటికీ ॥మాన॥ పరోపకారము గోరనిమూర్ఖుడు పరలోకము గనడెన్నటికి । పరగ నూరు సంవత్సరములు బ్రతికిన బ్రతుకిం కేమిటికి ॥మాన॥ పురుషుడు లేని మగువల జన్మము భువిలో వ్యర్థము యెన్నటికీ । తరుగని భాగ్యము యెంతగల్గినను తనయుడు లేకుంటేమిటికి ॥మాన॥ కుటిల మనసుగల జనులకు నుత్తమ గుణము కుదరబో దెన్నటికి । తటతటమంత్రము లెన్ని నేర్చినను ధన్యత బొందరెన్నటికి ॥మాన॥ ధరణిలో బీబీపేట నివాసుని దలచితే సద్గతి ముందటికి । మరువక హనుమద్దాసుని మాటలు మదిలో నమ్మేదెన్నటికి ॥మానస॥

చ॥ పతితుల నెల్ల బ్రోచు మన ।పాలిట శంభుడు గల్గియుండ నీ
వితర సురాళినెల్ల స్తుతి । యించుట న్యాయమదదెట్లనుచున్ నీ
పతిని నిరాకరించి కుల భామిని యన్యుని గోరినట్లు యీ
గతిని యెరింగి నీ విపుడు । కామరిపున్ మది గొల్వు జీవమా ! ॥
ఉ॥ ఎవ్వరు తల్లిదండ్రియిక । నెవ్వరు నీకు దయాదివర్గమున్

యెవ్వరు తోడు నీడ యిక నెవ్వరు నీకు ననాది బాంధవుల్
ఎవ్వరు నీదు యాపదల । నేర్పడ జిమ్మి తరింపజేయు వా
రెవ్వరు శంభుడే గతియు । నెందుకు నీ కతిచింత జీవమా ! ॥

## ధన్యాసి రాగం- ఆట

శివుడే తోడు నీకు । మనసా చింత సేయబోకు భవ పామరముల ద్రుంచి సద్గతి పదవి నిచ్చు నీకు ॥శి॥ పరుల దూరబోకు యొకరితో పంతమాడబోకు । గురుని పదములు విడచి యన్యమును కోరుచుండ బోకు ॥శి॥ పలికి బొంకకు కృతిమ పనులు సేయబోకు । నిలువని గాయము కన్నుల చూచుక నిక్కుచుండబోకు ॥శి॥ పెట్టి దెప్పకు నీచుల పెంపు సేయబోకు । పట్టిన వ్రతములు భంగపరచి యమబాధ నొందబోకు ॥శి॥ సుందర బీబీపేట నిలయుని జోలిపూట పూట । పొందుగ హనుమద్దాసుని రీతిగ పొసగ దల్చునోట ॥శి॥

ఉ॥ పాల సముద్రమందు నతి । భారముగా నుదయించు క్ష్వేలమున్
మేలని వెన్న ముద్దవలె । మింగి జగంబుల నేలినాడు యా
కాలుని బాధ బాపియా మృ । కండునిబాలుని బ్రోచినాడు ని
న్నేలగలేడ శంకరుడు । ఎందుకు నీకతిచింత జీవమా ! ॥

### కాంభోజి రాగం - ఆది

ఎంతజెప్పిన వినవె మనసా ఏమనందు నిన్ను । కంతుహరుని స్మరియించలేవు నీగతి యేమొ ముందు ॥ఎంత॥ ఇంతపాటి ధూర్తము నే నెందూ చూడలేదు । నీపంతగుణము యిది యేమో రవ్వంత బుద్ధిరాదు ॥ఎంత॥ నాటి నుండి మొరబెట్టి నాలుకంతబాయె । చేటుకొరకే నా మాటలు నీ చెవి నాటవేమి సేతు ॥ఎంత॥ వంకరకూతలు వారితో పదరనేమి ఫలము । శంకర హరశివ శంకర యని స్తుతిజేయ నీకే నయము ॥ఎత॥ కండలు నెత్తురుకాయము జూచుక గర్వపడగరాదు । కొండ చిలువవలె దేహము బెంచితే కొనకు ఫలములేదు ॥ఎంత॥ మాటికి బీబీపేట మహేశుని మరచి యుండుబోకు । సాటిరాని కైవల్య పదవియు సాధ్యమగును నీకు ॥ఎంత॥ వీనుల హనుమద్దాసుని మాటలు వింటె సుఖముకల్గూ । గానిపోని దుర్నడతలు నడచితే కల్గు యముని బాధ ॥ఎంత॥

చ॥ ఇరవుగ జన్మ జన్మముల । నెత్తినయప్పటి నుండి నేటికి
న్నెరిగియు నెగ్గజాలకను । నేర్పడ జేసిన పాపకర్మముల్
తరముగజేసి నీకు శివ । తారకమున్ కృపజేయునట్టి శ్రీ

గురుని సమాన మెవ్వరిక । గోరకు మన్యులనెల్ల జీవమా ! ॥

## దారు రాగము - ఏక

గురుతోటి । నెవ్వరుసాటి । మా ప్రభుతోటి ॥ఏ॥ శరణాని తనచెంత జేరినవారిని । కరుణతో చేపట్టి కడతేర్చి బ్రోచేటి ॥గు॥ అండపిండ బ్రహ్మాండము అంతట । పండువెన్నెలవలె నిండి వెలుగుచుండు ॥గు॥ అఖిల జీవుల కెల్ల నాధారభూతమై । సకలలోకములెల్ల సవరించుచుండేటి ॥గు॥ సారములేని సంసార బాధలను । నివారించి యాత్మ విచారము దెలిపేటి ॥గు॥ శివశివ యనియేటి శిష్యజాలమునెల్ల ప్రవిమలంబున । జన్మ పావనము జేసే ॥గు॥ మోహపాశములెల్ల మొదటికే దునుమాడి । సాహస బుద్ధి ప్రసాదింప చేసిన ॥గు॥ మేలాని నాదు మొరాలించి ప్రేమతో వాలాయముగ నన్ను పాలించునటువంటి ॥గు॥ వాదభేదంబులు వదలజాలని దుఃఖభేదము మాన్పి సమ్మోద మొందించిన ॥గు॥ చావుపుట్టుకలేని సంగతినెరిగించి । కేవలంబుగ ముక్తి త్రోవజూపే ॥గు॥ బాసుర బీబీపేట వాసుడౌ హనుమద్దాసునే కృపతోను దరిజేర్చి బ్రోచిన ॥గు॥

చ॥ సురువము జాజులున్ వకుళ । మల్లెలు మొల్లలు పారిజాతముల్
సరవితో బిల్వపత్రములు । సారసముల్ కరవీర పుష్పముల్
పరిమళ వస్తువుల్ మిగుల । బాగుగ దెచ్చియు సారెసారెకున్
పరమదయాళువౌ శివుని పాదము లర్చన సేయు జీవమా ! ॥

ఉ॥ భక్ష్యము లాజ్యముల్ మధుర । పాయసమున్ దధి పంచదారయున్
ఇక్షురసంబు తేనె మది । కింపగు చూతఫలంబు లాదిగా
భక్షణ సేయుమంచు సదు । పాయముచే జతగూర్చి నీవు యీ
తక్షణమందు మేరుగిరి । ధన్వున కర్పణచేయు జీవమా ! ॥

## ముఖారి రాగం - ఆట

పూజింపవే శైలపుత్రి ప్రాణేశుని బుద్ధితీరగ జీవమా । పూజింపవె భానుపూర్ణ ప్రకాశుని తేజముగల మంచి జాతిపుష్పములతో ॥పూ॥ గంగా తుంగభద్ర కావేరి తోయముల గ్రక్కునగొని తెచ్చియు । అంగూగ లనభిషేక మానందముగ చేసి । మంగళ కరుని సంపెంగ పుష్పములతో ॥పూ॥ కరమొప్ప విభూతీ । గంధమక్షింత లాఖండ బిల్వదళమ్ముల । కరవీర వకుళ చెంగల్వ చామంతులు । సరగూనదెచ్చియు సంతోషమొదవగ ॥పూ॥ తెల్ల విభూతీ । నల్లజడలు మంచి । తేజమొప్పుచునుండగ । ముల్లోకముల కాది మూలమై వెలసిన । చల్లనితండ్రికి మల్లెపుష్పములాతో ॥పూ॥ చిన్నారి చంద్రుడు మిన్నేటి సుందరి । శిరమందు శోభిల్లగ । పన్నగాభరణుని

సన్నుతి గావించి । తిన్నగ నేడు మధ్యాహ్న పుష్పములాతో ॥పూ॥ అంగుగజేరి మృదంగ నాదంబులు । సంగతిగ మ్రోయగ । భృంగీశుడాదిగ పొంగుచునటియింప । రంగుమీరినమంచి రాజీవముల తోడ ॥పూ॥ తాపత్రయాది బాధలనెల్ల దునిమేటి దైవశిఖా మణికి । దీప ధూపంబులు యేపుమీరగ నిచ్చి జాగుసేయక మమ్ము రక్షించుమని వేడి ॥పూ॥ ఘృతము బూరెలు మంచి కూరగాయలు పప్పు కొమరొప్పగను గూర్చియు పతితపావనునాకు పాయసాన్నముతోడ నతివేగ నైవేద్యమర్పించి ప్రేమతో పూ॥ భాసుర బీబీపేట ధన్యమందిరమున బాగు। నివసించియు । వాసి మీరగ హనుమద్దాసును నేలిన పార్వతీశుని నేడు పాతాళ పుష్పములతో ॥పూ॥

ఉ॥ బంగరు పళ్శెరంబులను । బాదుగ జేసియు సారెసారెకున్
రంగుగ దీపకాంతులును । రాజితవైభవ మొప్పుచుండగా
సంగతితోడ నీదు మది । సంతసమొంద పురారి కిప్పుడున్
మంగళమంచు బాడి యిక । ప్రస్తుతిజేయు జీవమా ! ॥

మంగళామని పాడవే । మానవ శంభు । లింగాని గొనియాడవే । శృంగారమైన త్రిశూలము కరమందు । పొంగుచు దాల్చిన పురవైరికి జయ ॥మం॥ కోటి రవి సంకాశుడు షణ్ముఖుగన్న కోమలి ప్రాణేశుడు నాణ్యమైన కాలకూటము ద్రావిన మేటియౌ మూలవిరాటునకును జయ ॥మం॥ అంగజ సంహారుడూ మేలైన మాతంగ చర్మాంబరుడూ । గంగశిర మందు పొంగుతూ దాల్చిన రంగైన ముద్దు సారంగపాణికి జయ ॥మం॥ అకలంక శుభగాత్రుడూ భక్తులకు కోరికలిచ్చే చారిత్రుడూ । సకలలోకములెల్ల సవరింప తానె కారకుడయ్యి బ్రోచు నాటక సూత్రధారికి ॥మం॥ కుండాల భూషణుడు వీరరసకోటి మండలిపోషకుడు। భండనమున చాలా బాధించి యసురుల ఖండించివేసిన ఖండేందుమౌళికి ॥మం॥ ధర బీబీపుర మందునా నిలిచియు హనుమద్దాసుని హృదయమందునా । కరువుదీరగ । ప్రేమగలిగి వాంఛలు ధీర । సిరులిచ్చీ వేగ రక్షించిన తండ్రికి ॥మంగళామని॥

## శ్రీరాగం - ఆది

హారతివ్వారే మనసా యిపుడు । మనగురురాయునకు హారతివ్వారే మనసా ।యిపుడు । నూరకోటి సుకుమార సుందరాకారునకు కర్పూరము వెలగగ ॥హా॥ నేరాములన్ని యెడబాసి భక్తులకెల్ల కూరిమితోడ మేలుజేసి । ఘోరమైన సంసారబాధలను దూరముజేసేటి కారణకర్తకు ॥హా॥ అందరాని ఫలమందబోకు నీ ఆశలు తీరపురోరన్నా । ముందు వాద భేదంబులెల్ల ద్రుంచి దీనులందిల మోదమివ్వగ మదిలో నెంచి । ఆదరించి నిమిషంబున సద్గతి । సాధనదెలిపెటి

సద్గురుమూర్తికి ॥హా॥ దోషగుణంబు లెల్ల దునిమి । బాధింపుచుండు యీషణత్రయము బాగ గడిగీ పాపమీరముల జోలి । లేకుండ నిను పాపమరులెల్ల భారద్రోలి । నీమీదికోరిక నిలిపి వేగముగను క్షేమముగను రక్షించెడివారికి ॥హా॥ వాసనా త్రయము ద్రుంచివేసి । తాపత్రయ మోసమెల్లను పొల్లుసేసి భాసుర బీబీపేటలో హనుమద్దాసుని నేలిన దయగుణశాలికి ॥హా॥

## హెచ్చరిక - రూపకతాళం

హెచ్చరికా హెచ్చరికా హెచ్చరికా సాంబా । సచ్చరిత్రాగమనుత సదయా హెచ్చరికా ॥హె॥ శీలా సువిశాలా దిక్పాలా ఘనశీలా । బాలశశి మౌళినుతపాలా హెచ్చరికా ॥హె॥ రంగా రణరంగా రిపురంగా భస్మాంగా గంగాధర కరభృత సారంగా హెచ్చరికా ॥హె॥ మారామర హారా సువిచార । గిరధర ధారాధరవిలసల్కేయూరా ॥హె॥ రక్షామరపక్షా నిటాలాక్షా విషభక్షా దక్షయాగ ప్రతాపలింగా ॥హె॥ దాసాజనపోషా గిరిజేశా సువిలాసా ఘాసావరబీబీపేట నివా సా హెచ్చరికా ॥హె॥

ఉ॥ ఏల హరంబు మానుమిక । నేమియుగావలెనంచు సారెకున్
చాలగ బుజ్జగించియును । సంతసమొందగ పంచదారయున్
పాలు భుజింపజేసి సదు । పాయముచే పవళింప నేర్పగన్
బాలియటంచు బాడి ఫణి । లాంఛను ప్రస్తుతిజేయు జీవమా ! ॥

## —:లాలిపాట :—

లాల పరమేశ లాలి మాతండ్రి లాలి గౌరీశ లాలి । లాలి భూతేశ లాలి శ్రీకంఠ లాలి విశ్వేశ లాలి ॥లా॥ పదునాల్గులోకంబులా బ్రహ్మవై పరగ సృజించినావు । పద్మనాభుండవయ్యి సర్వంబు పాలించినావు తండ్రి ॥లా॥ కాలాగ్ని రుద్రుండవై మహాప్రళయకాల సమయమ్మునందు । చాలగా లోకంబుల నిమిషమున సమయింప జేసినావు ॥లా॥ పంచభూతంబు లెల్లా నీవయై ప్రాణికోటులకు నెల్లా । నాధారభూతమయ్యా ॥ నిరతంబు నాహార మొసగెదాపూ ॥లా॥ కడలి సురాసురులుదరచ నతిభయంకరముగా జనియింపగా కాలకూటంబు ద్రావి దివిజులను దరి తేర్చినావు తండ్రి ॥లా॥ ముందు మార్కండేయుడు । నిను చాల ముదముతో నుతిజేయగా । కా లుని బాధబాపి బాలుని కాచి రక్షించినావు ॥లా॥ బీబీ పేట పురమందునా నివసించి ప్రీతితో వేగంబుగా । హనుమద్దాసుని బ్రోచితివని మిమ్ము అభినుతించితి తండ్రీ ॥లా॥

ఉ॥ జో పరమేశ యంచు కడు । చోద్యంబుగ విశ్వరూపునిన్
పాపనిరీతిగన్విరుల । పానుపుపై పవళింపజేసి చి

ద్రూప శరీర నేడు తమ । తొయ్యలతో నిదురించి లో లతం
తేపకు కాముకేళీ కడు । దేలుమటంచు నుతించు జీవమా ! ॥

## —: జోలపాట :—

జో పార్వతీలోల బోజో గుణశీలా । జో భక్త పరిపాల జోజో కృపాళా ॥జో॥ బంగారుడోలికల బాగుమీరగను శృంగారముగ పాన్పు చెలగుచుండను । రంగైనబంతు లల్లాండుచుండగను పొంగుచును యిక నిద్రపోవయ్య స్వామి!॥జోజో॥ సుందరీమణి గంగ చందనము బూయా । అందముగ పుష్పహారము లలనలేయంగ । మందయానలు ఆకుముడుపులందీయ । పొందుగను యిక నిద్రపోవయ్య స్వామి!॥జో॥ పలుమారు స్త్రీలంత పాటబాడగను । చెలియ వింజామరలు వేయుచుండగను । చెలగి ప్రమథులు వినతి చేయుచుండగను । పొలుపు మీరిగ నిద్ర పోవయ్య స్వామి ॥జోజో॥ కామసంహర రాత్రి జామాయెగదరా ।ప్రేమ మీరగ ఛందమామ నిచ్చెదరా । కోమలంబగు ముద్దుమోము జూపర । క్షేమముగ నీనిపుడు శయనించుకోరా ॥జో॥ ధరబీపేటలో దగ వెలసినావు । పరగ హనుమద్దాసు భవములను నీపూ । బరిమార్చి కైవల్య పదవి నిచ్చెదపూ । శరణన్న వారలను దరిజేర్చినాపూ ॥జో॥

చం॥ హిమకరుడ స్తమించె కళ । హీనమునై గమనించె తారకల్
క్రమమున భాస్కరుండును । ప్రకాశముచే నుదయించె నంతట
స్గమలము లుల్లసిల్లె శశి । కంధర మేల్కొనవేయటంచు యీ
సమయమునందు శంకరుని । చాలగ ప్రస్తుతియు జీవమా ! ॥

## —: మేలుకొలుపు :—

మేలుకో శ్రీ గౌరి నాయక । మేలుకొనుభువనైకదాయక । మేలుకొను శ్రీ విఘ్నదాయక । మేలుకొనవయ్యా । శంభో । మేలుకొనవయ్యా ॥మే॥ మేలుకొనవే ప్రాణలింగా । మేలుకొనవే భావలింగా । మేలుకొనవే గో తురంగా మేలుకొనవయ్యా ॥మే॥ జలజరిపుడస్తాద్రి చెంతకు జేరబోయెను కుక్కుటంబులు । చెలగి కూతలు కూయసాగెను । జగములంతటనూ । పలుతెరంగుల పక్షిజాతులు పైనమాయెను దిశలకెల్లను । సలలితంబుగ యోగనిద్రయు చాలు మేల్కొనవే । శంభో ॥మే॥ దినకరుడుదయించుచుండెను దీప్తినొందె సమస్త జగములు కమలము వికసింపబూనెను వరుస తోడుతను । ఘనముగ వెలుగొందుతారల కాంతులెల్లను తొలగిపోయెను । సనకమునినుత యోగనిద్రయు చాలు మేల్కొనే । శంభో ॥మే॥ సన్నుతామర రక్ష మీపద సారసము లర్చించుకొరకై । పన్నుగా గంగోదకము చేపట్టి వేగము । కిన్నరామర సిద్ధయక్షులు తిన్న

గా నిట కేగుదెంచియు నిన్ను వేడుచు ద్వారమందున నిలచియున్నారు । శంభో ॥మే॥ సరసి జంబులు బిల్వ దళములు । సరవిలో సంపెంగ సుమములు మరువమును కురువేరు దమన ము మల్లెమొల్లలును । సరగునను సమకూర్చి యిటకును సంతసంబున మునివరేణ్యులు మర ల మిము పూజించుకొరకై వచ్చియున్నారు । శంభో ॥మే॥ మలయజము పన్నీరు నత్తరు మంచి కస్తూరి పునుగు నగరు సలలితంబుగ మీకు నేనిడు సమయమందునను । చెలగుచూను రాజో పచారము జేయబూనుట కిచ్చగించియు । కొలుపు కూటమునందు భక్తులు కోరియున్నారు । శంభో ॥మే॥ ఇలలో బీబీపేట పురమున హీరమణిమయ మందిరమున । నిలిచి భక్తులకెల్ల సద్గ తి నేర్పుతోడుతను । గలుగజేసియు హనుమద్దాసుని కరుణనేలితివనుచు మీ పదజలజములు నమ్మితిని నీ కృపజేసి మేల్కొనవే । శంభో ॥మే॥

సమాప్తము



ముద్రణ :

వైష్ణవి ఆఫ్సెట్ ప్రింటర్స్

రాంకోట్, హైదరాబాద్,